

షుకూర్‌బేక్ బెయ్‌షెనాలీయెవ్

# కొమ్ముల గొర్రెపిల్ల







# అజీజ్



అజీజ్ తండ్రి గొర్రెలకాపరి. తండ్రితో కలిసి వేసవికాలంలోనూ చలికాలంలోనూ అజీజ్ పర్వతాల్లో వుంటాడు. తండ్రి అక్కడున్న పచ్చికబయళ్లలో గొర్రెలను మేపుతూ వుంటాడు. అతడు మేపుతూన్నవి మంచి భారీ జాతి గొర్రెలు. తండ్రి గొర్రెలు కాస్తూ వుంటే, తల్లి 'యూర్త'లో* వుండిపోయి, వంట చేసుకుంటూ, చిరిగిపోయిన బట్టలు కుట్టుకుంటూ, సంసారం చూసుకుంటూ వుంటుంది. ఇక సాయంకాలం అయేసరికల్లా గొర్రెలను పెండెంలోకి తోలడంలో పెనిమిటికి సాయంచేస్తుంది.

సాయంకాలం, తల్లితండ్రులిద్దరూ గొర్రెలన్నిటినీ పెండెంలోకి తోలి, యూర్త చేరుకున్నారు. తండ్రి యూర్తలోకి వెళ్లి, పసిపాపడు అజీజ్‌ను చేతుల్లోకి తీసుకుని, వాణ్ణి ఎగరవేసి పట్టుకుంటూ వాడితో ఆడుకోవడం ఆరంభించాడు.

తల్లికి భయంవేసి:

"ఇహ చాలు, వాణ్ణి కిందకి పడేస్తావు!" అంది.

---

* 'యూర్త' అంటే కొయ్యలతో చట్రంచేసి, చట్రంపైన బనాతు వేసి కట్టిన గుడిసె. – సం.





"గొర్రెలకాపరి కొడుక్కి భయం అంటే ఏమిటో తెలియకూడదు, వాడి వొళ్ళు రాయిలా వుండాలి. మరి నాలుగు రోజులు పోతే, వాడు పెద్దాడై, అసలైన గొర్రెలకాపరికి మల్లే, గుర్రం ఎక్కి ఝూమని సవారిచేస్తాడు" అన్నాడు తండ్రి నవ్వుతూనూ.

తల్లి అజీజ్‌కేసి చేతులు చాపి,

"రా, రా, నా దగ్గరకి!" అని వాణ్ణి పిలిచింది.

అజీజ్‌కి మాత్రం తండ్రి దగ్గరే బాగుందనిపించింది. తండ్రి మంచి పొడుగ్గా బలంగా వున్నాడు, అతడు తొడుగుకొన్న అంగరకా గొర్రె బొచ్చు వాసనా, నెగడి పొగ వాసనా కొట్టుతూంది.

కొన్ని రోజులు గడచిన తరువాత, ఒకనాడు పొద్దున్న తండ్రి

"మంద కాయడానికని ఈవేళ అజీజ్‌ని నాతో కూడా తీసుకెళ్తున్నాను" అన్నాడు.

తల్లి గాభరాపడి,

"వొద్దొద్దు, వాడింకా చిన్నపిల్లాడు" అంది.

అందుపైన ఇద్దరూ వాదన వేసుకున్నారు: మంద కాయడానికి తనతో కూడా తీసుకెళ్తానని తండ్రీ, తన దగ్గరే ఇంట్లో వుండిపోవాలని తల్లీ. చివరికి ఇద్దరూ ఒక నిర్ణయానికి వచ్చారు: ఇద్దరూ అజీజ్‌ని పిలవడం, వాడు ఎవరి చేతిలోకి వెళ్తే, వారి మాట ప్రకారం జరగడం.

అజీజ్‌ని యూర్త మధ్య కూర్చోబెట్టారు. "నా దగ్గరకి రారా!" అని తల్లి పిలిచింది. "నా దగ్గరకి రారా!" అని తండ్రి పిలిచాడు.

అజీజ్ మొదట తల్లికేసి చూశాడు — వాడివైపు తల్లి చేతులు చాచి ముద్దుగా చూసింది.

తర్వాత తండ్రికేసి చూశాడు — తన దగ్గరకి రమ్మని చేటలంతటి అరచేతులతో తండ్రి సంజ్ఞచేశాడు.

ఆ చేతులను అజీజ్ చూసి, ఇక మనసు పట్టలేక తండ్రి దగ్గరకు పరుగెత్తాడు.

"నీకు గుర్రపుసవారీ నేర్పుతా౯నా! గొర్రెలమంద కాయడం నేర్పుతా౯నా! ఏం?" అన్నాడు తండ్రి.

తండ్రీ కొడుకూ యూర్తలోనుంచి బయటికి వచ్చారు. జీనువేసి సిద్ధంగా వున్న గుర్రంమీద తండ్రి కూచుని, తన ముందు అజీజ్‌ను కూచోపెట్టుకున్నాడు. ఇద్దరూ హాయిగా కబుర్లు చెప్పుకుంటూ మంద దగ్గరకు వెళ్ళిపోయారు.

తల్లి యూర్తలో వుండిపోయి, గుర్రం ఎక్కి వెళ్ళిపోతూన్న వాళ్ళిద్దరికేసి చూస్తూ చాలాసేపు నుంచుంది. తర్వాత ఆమె జాడీ నిండా పాలుపోసి, సంచిలో బ్రెడ్డు పెట్టుకుని, ఇక వాళ్ళవెంట బయల్దేరింది.



# అజీజ్ గొర్రెలకాపరి అవుతాడు



అజీజ్‌కి తన తండ్రితో కలిసి పచ్చికబయలుకి వెళ్లిన తొలిరోజునుండీ, గుర్రంమీద కూచోవడమూ, గొర్రెపోతులు పచ్చిక మేస్తూంటే వాటిని కాయడమూ తనకి ప్రపంచంలో అన్నిటికంటె హెచ్చుగా నచ్చింది.

తను తల్లిదగ్గరే యూర్తలో వుండిన రోజుల్లో తనకి గొర్రె తప్ప మరొక వస్తువు అంటూ అవుపడేదే కాదు. మరి ఇప్పుడో....

ఇప్పుడు, బ్రహ్మాండమైన గుర్రంమీద మడతపెట్టిన 'కొర్పాచో' ముఖమల్లు రజాయి పైన కూచుని తండ్రి అంగరకాలోనుంచి, కోలంకి పిట్ట మల్లేనే తల పైకిపెట్టి అన్నీ చూస్తూ వుంటాడు.

తను స్వారిచేస్తూ వుంటే, తనను గుర్రం ఉయ్యాల వూపుతూన్నట్టే వుంటుంది. తను ఎంతో పెద్దవాడైపోయినట్టు కూడా అనిపించుతుంది అజీజ్‌కి. వెనుకటి రోజుల్లో పర్వతాలను చూసేటప్పుడల్లా తన కెంతో హడలెత్తిపోయేది. అటువంటిది, ఇప్పుడు వాటిని దగ్గరనుండి చూసేసరికి, అవి మునుపటిలా భయంకరంగా లేనేలేవు సరికదా, ఎంతో అందంగా వున్నాయి కూడానూ.

అజీజ్ తొలిసారి చెట్ల ఆకులను ముట్టుకోవడం కొండల్లోకి వెళ్లినప్పుడు. వాటిని ముట్టుకొని,

"చెట్లు, చెట్లు!... హేయ్, హేయ్!" అని అరుస్తూ, అతి సంబరపడిపోయి చేతులెగరేశాడు.

"ఇది దేవదారు వృక్షం.... ఇది బర్చ్ చెట్టు.... ఇది అర్చా చెట్టు.... ఇది శ్వేతనందిని మొక్క.... ఇది హనీసకుల్ తీగె...." అంటూ తండ్రి ఒక్కొక్క చెట్టూ ఒక్కొక్క మొక్కా చూపించి, వాటి పేర్లు చెప్పాడు.

"దేవదారు... బర్చ్... అర్చా...." అంటూ అజీజ్ తండ్రి మాటలను పునశ్చరణ చేశాడు.

పేర్లన్నింటినీ వెంటనే జ్ఞాపకం పెట్టేసుకోవాలనిపించింది అజీజ్‌కి. కాని అన్ని చెట్లూ అన్ని మొక్కలూ ఒక్కలా లేనేలేవు, ఒక చెట్టుకీ ఒక చెట్టుకీ, ఒక మొక్కకీ ఒక మొక్కకీ ఎంతో భేదం వుంది!

తండ్రితో కలిసి అజీజ్ నిటంగావున్న కొండగట్టు దగ్గరకి వెళ్లేసరికి, అక్కడ అగపడింది — తెల్లని నురుగులు కక్కుతూ, బ్రహ్మాండం బద్దలయేటట్టు ధ్వని చేస్తూ, హోరున గర్జిస్తూన్న జలపాతం.

"నీళ్లు, నీళ్లు!" అని అరిచాడు అజీజ్.

తండ్రి గుర్రాన్ని ఆపి, అజీజ్ ముంగురులను ముద్దుగా నిమిరి,

"ఇది జలపాతం" అని చిరునవ్వు నవ్వుతూ చెప్పాడు.

"జలపాతమా?" అని అడిగాడు అజీజ్.

"అవును మరి. 'జలపాతం': 'జలం' — అనగా నీరు, 'పాతం' — అనగా కింద పడడం. చూస్తున్నావుగా — రాళ్ల సందులనుండి నీరు వచ్చి ఎలా పడుతూందోనూ!" అన్నాడు తండ్రి.

"జ — ల — పా — తం! జ — ల — పా — తం!" అని అజీజ్ ఉత్సాహంగా కేకలువేశాడు. ఆ కుర్రవాడి కంఠస్వరం జలపాతం గర్జనలో లీనమైపోయింది.

తండ్రితో కలిసి అజీజ్ ప్రతిరోజూ పర్వతాల్లోకి వెళ్లేవాడు, ప్రతిరోజూ ఏదో ఒక కొత్త విషయం గురించి తెలుసుకునేవాడు.

# తండ్రి లేకపోతే అజీజ్‌కి తోచదు



అజీజ్ రోజంతా తండ్రితో కలిసి కొండల్లో గడిపేవాడేమో, వాడు ఇంట్లో లేకపోవడంచేత తల్లికి మొదట్లో ఏమీ తోచేదికాదు. కాని తరువాత ఆమెకి అలవాటైపోయింది.

"మొగపిల్లలందరికీ తల్లిదగ్గరకంటె తండ్రిదగ్గరే చేరిక" అని నిశ్చయించుకుని, మనస్సు సరిపెట్టుకుంది.

సాయంకాలానికి తండ్రికొడుకులిద్దరూ గొర్రెల్ని మేపునుండి తోలుకువచ్చే వేళకి, తల్లి వాళ్లకు ఎదురుగా వెళ్లి, అలసిపోయినప్పటికీ హాయిగా వున్న అజీజ్‌ని గుర్రంమీదనుండి అందుకుని యూర్తలోకి తీసుకెళ్లిపోయేది. అజీజ్‌కి వెంటనే నిద్రపట్టిపోయేది. జలపాతం గురించీ, కొండల్లో పెరుగుతూన్న లేత నీల వర్ణపు దేవదార్ల గురించీ, భారీ పొట్టేళ్ల గురించీ నిద్రలో కలలుగనేవాడు.

ఒకనాడు ఉదయాన తల్లి అజీజ్‌ని నిద్రనుంచి పెందలాడే లేపక, అజీజ్‌ని తండ్రితో పంపించకుండా యూర్తలోనే వుంచేసింది. అజీజ్ నిద్రనుంచి లేచి, తండ్రి లేకపోవడం చూసి, బొళ్ళున ఏడవడం మొదలెట్టి, "నాన్నా, నాన్నా!" అని అదే పిలుపులు పిలుస్తూ, తండ్రిదగ్గరకి కొండల్లోకి వెళ్లిపోతానని మారాంపెట్టాడు.

తల్లి అజీజ్‌ని వూరుకోపెట్టడానికని రకరకాల తాయాలు వాడిముందు పెట్టింది, కబుర్లూ కథలూ చెప్పింది. కాని తల్లి ఎన్ని చేసినా ఎన్ని చెప్పినా, అజీజ్ మాత్రం మారాం మానకుండా:

"నాన్న దగ్గరకి వెళ్లిపోతాన్నేను! నాన్న దగ్గరకి వెళ్లిపోతాన్నేను!" అని గోలపెట్టాడు.

అజీజ్‌ని తల్లి సాయంకాలం వరకూ వూరుకోపెట్ట లేకపోయింది. ఇది జరిగిన తరువాత మాత్రం, తల్లి, ఇక ప్రతిరోజూ అజీజ్‌ని పెందలాడే లేపి, వాడికి ఫలహారం పెట్టి, బట్టలు తొడిగి వాణ్ణి సిద్ధంచేసి, తండ్రితో కూడా మంద కాయడానికని కొండల్లోకి పంపించేసేది.



# "నేనప్పుడే పెద్దాణ్ణయానని నాన్నకి తెలియాలి!"



ఉదయంనుండి సాయంకాలం వరకూ అజీజ్ తండ్రితో గుర్రంమీద కూచుని, భారీ పొట్టేళ్లను మేపడంలో తండ్రికి సాయంచేస్తూండేవాడు.

అసలైన గొర్రెలకాపరిలా, అజీజ్ నెగడి దగ్గర కూర్చుని భోజనంచేసేవాడు, 'కొర్పొచో' ముఖమల్లు రజాయిని దేవదార్లకింద పరచుకుని తలకింద గుర్రపుజీను పెట్టుకుని పడుకునేవాడు. ఇప్పటికప్పుడే ఎన్నో కొత్త విషయాలు తెలుసుకున్నాడు, వొత్తుగా మొలచిన గడ్డి పొదల్లోనుంచి నిర్భయంగా దూసుకుపోవడమూ, కొండసానువుల్లో దొరికే రేవల్చిన్ని కూరనూ, కుక్కగొడుగులనూ ఏరడమూ నేర్చుకున్నాడు. తనపై ఎగురుతూన్న పెద్ద గుడ్లగూబను చూసినా తనకిప్పుడు ఏమీ భయంవేయడంలేదు.

ఒకనాడు తండ్రితో కూడా అజీజ్ పచ్చగడ్డి మొలుస్తూన్న దిబ్బమీద కూర్చుని, మేత మేస్తూన్న గొర్రెలకేసి చూస్తున్నాడు. పొలాసతాడుతో ముందుకాళ్లకు బంధంవేయబడిన గుర్రం తొట్రుకుంటూ పచ్చిక మేస్తూంది. తటాలున తండ్రి

"అయ్యో, గొర్రెలు ఎంత దూరంగా వెళ్లిపోయాయో!" అని చెంగున లేచాడు.

"నే వెళ్తాను నాన్నా! నే వెళ్తాను!" అని అజీజ్ కేకవేసి, పొట్టేళ్లను తోలుకురావడానికి పరుగెత్తాడు. అలా పరుగెత్తుతూ: "నేనప్పుడే పెద్దాణ్ణయానని నాన్నకి తెలియాలి!" అని తన మనస్సులో అనుకున్నాడు.

గొర్రెలు మందలోనుండి తప్పిపోయి, ఎంతో దూరం వెళ్లిపోయాయి.

"కి — యో — య్! కి — యో — య్!" అని అజీజ్ కేకవేస్తూ, దూరంగా వెళ్లిపోయిన బూడిదెరంగు గొర్రెను — మందలో వున్న గొర్రెలన్నిటిలోనూ భారీ గొర్రెను — తోలుకురాసాగాడు.

తండ్రి దిబ్బమీద నిలుచుని కొడుకువైపు ముద్దుగా చూస్తున్నాడు. కొడుకు తనకెంతో సాయంగా వున్నాడు కదా అని సంతోషించాడు.

మందకి పెద్దదైన బూడిదరంగు పొట్టేలువెంట కడమ గొర్రెలు వెళ్లాయి.

పెద్ద పొట్టేలును మళ్లించేందుకని, అజీజ్ కేకవేస్తూ దానివెంట పరుగెత్తాడు. కుర్రవాణ్ణి చూసి పొట్టేలు తల పైకెత్తింది, చెవులు ఒక్కసారి ఆడించింది. ఆడించి, తనకు కేక ఏదీ వినబడనట్టుగా, మళ్లీ గడ్డి మేయసాగింది. దాని వాలకం చూసి అజీజ్‌కి చెడ్డ కోపం వచ్చింది. ఆ కోపంతో, దానిని పడపడ బాదాడు. బాది, దానిని మళ్లించేందుకని, దాని చెవులు పట్టుకున్నాడు. అది తల ఇటునుండి అటు వూపింది, అలా అది వూపడంతో అజీజ్ కిందపడిపోయాడు. కాని వెంటనే చెంగున లేచిపోయి, రెండు చేతులతోనూ దాని బొచ్చు పట్టుకున్నాడు. అంతవరకూ నెమ్మదిగా మేస్తూన్న ఆ పొట్టేలు తటాలున భయపడిపోయి, గంతులేస్తూ గిరగిర తిరిగి, అజీజ్‌ను పచ్చికనేలమీద బరబర ఈడ్చేసింది. తనను ఈడ్చేస్తూన్నప్పటికీ అజీజ్ మాత్రం లొంగదల్చుకోక, దాని మెడ గట్టిగా పట్టుకున్నాడు. చిట్టచివరికి అజీజ్ బలం తగ్గిపోయి గడ్డిలో పడిపోయాడు.

పొట్టేలు నుంచుండిపోయి, తల ఆడించి, పదునుగా వున్న డెక్కతో చప్పున ఆ కుర్రవాడి కాలిమీద ఒక్క తాపు తన్నింది.

అజీజ్ ఆ క్షణానికి ఉద్రేకంతో లేచిపోయాడు. లేచి ఇక పొట్టేలువెంట పరుగెత్తి వుండేవాడే; కాని కాలు తన స్వాధీనంలో లేకపోయింది. తల తిరిగిపోతూంది. లేచినవాడల్లా మళ్లీ కిందపడిపోయాడు.

దూరంనుండి ఇదంతా కనిపెట్టుతూన్న తండ్రికి ఇక భయంవేసి, పరుగున కొడుకు దగ్గరకి వెళ్లి చూశాడు: అజీజ్ గడ్డిలో పడిపోయి ఉన్నాడు, వొంట్లో చలనంలేదు, కాలిమీద నెత్తురు....

తండ్రి వంగి, రెండు చేతుల్తోనూ అజీజ్‌ను ఎత్తుకుని తన విశాల వక్షస్థలానికి హత్తుకుని, వాణ్ణి అతి జాగ్రత్తగా ఇంటికి తీసుకెళ్లాడు.



# అజీజ్ కోలుకుంటాడు



అజీజ్ మంచంపట్టి అప్పుడే కొన్నాళ్లయింది. వాడిదగ్గరనుండి తల్లి కదలడమే లేదు. వాడిని వెయ్యి కళ్లతో చూసుకుంటూ, తన పంచప్రాణాలూ వాడిమీద పెట్టుకుని వాడికి సంరక్షణ చేస్తూంది. రుచి అయిన ఆహారం — ఓనాడు 'కూర్‌దాక్,' ఓనాడు 'మంతీ,' ఓనాడు 'బెష్‌బార్ మాక్'* — వండి పెట్టుతూంది.

ఈ జీవితమూ, ఈ వాలకమూ, ఇలా మంచంపట్టి వుండడమూ అజీజ్‌కి సుతరామూ కిట్టడంలేదు. వాడికి విసుగేసిపోతూంది. తండ్రి దగ్గరికి ఎప్పుడు వెళ్లిపోదునా, ఎప్పుడు మంద కాస్తునా అని ఉవ్విళ్లూరుతున్నాడు అజీజ్.

ఒకనాడు ఉదయం అజీజ్ నిద్రనుండి మేల్కొని చూసేసరికి, తన మంచంమీద కూచునున్నాడు తండ్రి. అజీజ్ కొద్దిగా పైకిలేచి, తండ్రిచేయి పట్టుకుని

"నీతో నేనూ వస్తా.... మనం వెళ్లిపోదాం ఇక్కడ్నుంచి!" అని మారాం పెట్టాడు.

"అలానేరా, చిట్టీ! అలానే!" అన్నాడు తండ్రి చిరునవ్వు నవ్వుతూ, "ఇప్పుడే బయల్దేరుదాం. ఇదిగో, ఒసేవ్! చిట్టిగాడికి బట్టలు తొడగవే!" అన్నాడు భార్యని పిలిచి.

తండ్రి గుర్రం ఎక్కి కూచుని, తన ముందు మెత్తని బాలీసు వేసి, దానిపైన అజీజ్‌ని కూచోబెట్టాడు. ఇక ఇద్దరూ బయల్దేరారు.... పచ్చికబయలువైపు కానేకాదు, కేవలం ఇంకొక వైపు.

"ఎక్కడికి వెళ్తున్నాం, నాన్నా?" అని అడిగాడు అజీజ్.

"వూళ్లోకి రా, చిట్టీ!" అని తండ్రి జవాబుచెప్పి, గుర్రాన్ని దౌడుతీయించాడు.

ఇన్ని రోజులైన తర్వాత మళ్లీ చక్కని చల్లగాలి పీల్చుతూ, గుర్రంమీద కూచుని ఝూఝూమని వెళ్తూంటే అజీజ్‌కి హాయ్ హాయ్ అనిపించింది — కాలు నొప్పిపెట్టడమే లేదు!

అలా స్వారిచేస్తూ ఎంతో దూరం, ఎంతో దూరం వెళ్లారు, కొండ కనుమల్లోనుంచి కిందకి అలా దిగుతూనే వున్నారు. చిట్టచివరికి ఒక సరస్సు దగ్గరకు వచ్చారు. సరస్సు వొడ్డున తెల్లని కుటీరాల్లాంటివి ఎన్నో వున్నాయి. తండ్రి గుర్రంమీదనుండి దిగిపోయి, అజీజ్‌ని ఎత్తుకుని ఒక కుటీరంలోకి వెళ్లాడు.

ఆ కుటీరం ఒక షాపు. ఆ షాపులో అద్భుతమైన వస్తువులు ఎన్నెన్నో వున్నాయి. వాటిని చూసేసరికి అజీజ్‌కి కళ్లు తిరిగి పోయాయి.

పెద్ద మీసాలున్న ఒకతను కౌంటరు వెనుక కూచునున్నాడు. అతడు హుషారుగా వున్నాడు, అతడి కళ్లు సరదాగా నవ్వుతూ వున్నాయి. ఆగంతువులు షాపులోకి రావడం చూసి అతడు లేచి, వచ్చినవారిని మర్యాదగా పలకరించాడు. అతడితో తండ్రి ఏమిటో చెప్పాడు. అతడు తల వూపి, అజీజ్‌కేసి కన్ను గీటి, అలమారాల వెనుకగా ఎక్కడికో మాయమైపోయాడు.

---

*'కూర్‌దాక్' — మాంసంతోనూ బంగాళాదుంపతోనూ చేసిన వంట; 'మంతీ' — మాంసంతో నింపి నీటిలో ఉడికించిన పిండివంట; 'బెష్‌బార్‌మాక్' మాంసంతోనూ ఒక రకం సేమియాతోనూ చేసిన వంట. ఇవన్నీ కిర్గీజ్ జాతికి సంప్రదాయ సిద్ధమైన వంటలు. — సం.

గోధుమరంగు చిన్న సూటూ, ఒక జత గోధుమరంగు బూట్సూ పట్టుకుని అతడు మళ్లీ ప్రత్యక్షమయాడు.

"ఇవిగోనండయ్యా! ఈ సూటూ బూట్లూ తీసుకోండి. ఇవి మీ పైల్మాన్‌కి చక్కగా సరిపోతాయి!" అన్నాడు ఆ షాపు అసిస్టెంటు.

అజీజ్‌కి ఊపిరాడిందికాదు: ఈ సూటూ బూట్లూ తనకేనా?

తండ్రి ప్రశాంతంగా చిరునవ్వు నవ్వుతూ, జేబులోనుంచి డబ్బుతీసి, కొన్ని కాగితపు ముక్కలు లెక్కపెట్టి, షాపు అసిస్టెంటుకి అందించుతూ

"ఈ పెంకెపిల్లాడికోసం కాస్త తీపి సామాను తూచి ఇవ్వండి — చిన్న పొట్లాం వొద్దు, పెద్ద పొట్లామే తూచండి!" అన్నాడు తండ్రి.

షాపు అసిస్టెంటు అజీజ్‌కేసి మరొకసారి కన్నుగీటి, పిప్పరమెంట్లూ బిస్కట్లూ హల్వా తూచి, వాటన్నిటినీ ఒక పెద్ద ప్యాకెట్టు నిండా నింపి, ఆ ప్యాకెట్టును తండ్రికిచ్చాడు.

తండ్రీ కొడుకూ షాపులోనుంచి బయటికి వచ్చేసి, పక్కనే వున్న కుటీరంలోకి వెళ్లారు.

అజీజ్‌కి ఇక్కడ మరీ ముచ్చటేసింది. ఈ కుటీరంలో వున్నంత శుచీ, శుభ్రతా అజీజ్ ఇంతవరకు ఎక్కడా చూడలేదు. ఇక ఇక్కడ వాసన కూడా ఎంతో ఇంపుగా వుంది!

తెల్లని అంగరకా వేసుకుని అక్కడ కూచున్న ఒక అమ్మాయి లేచి వీరికి ఎదురుగా వచ్చింది. ఈమె కూడా షాపు అసిస్టెంటే అనుకుని, తనకోసం కొనబోయే మంచి మంచి వస్తువులను తల్చుకుని, అప్పుడే ముందుగానే సంబరపడ్డాడు అజీజ్.

కాని జరగడమేమో మరొక విధంగా జరిగింది. ఆ అమ్మాయితో తండ్రి ఏదో మెల్లగా చెప్పాడు. ఆ తర్వాత, అజీజ్‌తో తండ్రి బిగ్గరగా అన్నాడు:

"ఒరే, అజీజ్! కొత్త సూటు తొడుక్కోరా, ఎలా వుందో చూదాం!"

ఆ అమ్మాయి అజీజ్‌ని తెల్లని దుప్పటి పరచి వున్న సోఫామీద కూచోబెట్టి, అజీజ్ తొడుగుకొన్న బూట్లను విప్పడం మొదలెట్టింది.

ఇక సరిగా అప్పుడు అర్థమైంది అజీజ్‌కి — అసలు ఆ అమ్మాయి షాపు అసిస్టెంటు కానేకాదనీ, ఆమె డాక్టరు అనీ.

అజీజ్‌కి తండ్రి కొత్త సూటు తొడిగేలోపున, అజీజ్‌కి తగిలిన గాయాన్ని డాక్టరు పరీక్షచేసి, గాయానికి ఏదో మందు రాసి, బేండేజిగుడ్డతో అతిజాగ్రత్తగా కట్టుకట్టింది.

తనకి నొప్పి అనిపించినప్పటికీ, అజీజ్ ఇంత పిసరైనా కేకవేయలేదు.

"అసలైన పైల్మాన్ వోయ్, నువ్వు!" అంది అమ్మాయి చిరునవ్వు నవ్వుతూ. "ఇప్పుడు లేచి నుంచో, భయంలేదులే!"

ఆ అమ్మాయి సాయంతో అజీజ్ నుంచున్నాడు. ఆమె అజీజ్‌ని మెల్లగా ముందుకు నెట్టింది.

తన కాళ్లలో బలంలేకపోవడాన్ని అజీజ్ ఎంతో కష్టంమీద నిలబడ్డాడు, కాళ్లు గజగజ వణికాయి.

అజీజ్ నింపాదిగా ఒక అడుగు వేశాడు, తరువాత రెండో అడుగు... మూడో అడుగు. మరి కొద్దిసేపటికి అజీజ్ మామూలుగా నడిచేశాడు — తన కాలికి గాయం తగిలిందన్న సంగతే మరచిపోయాడు అజీజ్.

అంగరకా వేసుకున్న అమ్మాయి మందూ, బేండేజీ తండ్రి చేతికిచ్చి, వీడ్కోలుచెబుతూ అంది:

"రోజు విడిచి రోజు కట్టు మార్చండి. మరి కొద్దిరోజులకల్లా మీ అబ్బాయి పూర్తిగా ఆరోగ్యం కోలుకుంటాడు!"



# "పెద్దపొట్టేలూ! నీ పని పట్టిస్తాం!"



"ఒక్క నాల్గురోజులు ఓపికపట్టు రా, చిట్టీ! సమయం వస్తుంది, ఆ బూడిదెరంగు పొట్టేలు పని పట్టిద్దాం!" అన్నాడు తండ్రి అజీజ్‌తో.

ఆ సమయం కోసం అజీజ్ ఉద్రేకపడుతూ ఓపికతో కాచుకున్నాడు. తనను గాయపరచిన జంతువుమీద ఎంత వేగం పగతీర్చుకుందునా అని ఉబలాటపడ్డాడు.

అజీజ్‌కి ఆరోగ్యం పూర్తిగా కుదుటబడిన తర్వాత ఒక రోజున తండ్రి అజీజ్‌ని పిలచి "ఒరే, చిట్టీ! తయారుకారా! ఆ పొట్టేలుకి బుద్ధిచెప్పే రోజు వచ్చిందిరా!" అన్నాడు.

గోడను వేలాడుతూన్న కొరడాను అజీజ్ చేతబుచ్చుకుని:

"దాన్ని బాగా కొడదాం కదూ, నాన్నా?" అన్నాడు.

"కొట్టడం ఎందుకు? దానికి యజమాని పట్ల భయభక్తులు నేర్పాలి. అప్పుడు దానికి ఎంత బుద్ధి వచ్చేస్తుందంటే, కొత్త జన్మ ఎత్తినట్టే అనిపిస్తుంది దానికి. నువ్వు మాత్రం భయపడినట్టు అవుపడకూడదుసుమా. నీకు భయంవేస్తే మాత్రం వెంటనే చెప్పేయడమే మంచిది" అన్నాడు తండ్రి.

"అబ్బే, నాకు భయంలేదు" అన్నాడు అజీజ్. అన్నాడే కాని, భయంవేసి గుండె ఝల్లుమంది.

తండ్రీ, అజీజూ యూర్తలోనుంచి బయటికి వచ్చి, గొర్రెలమంద దగ్గరకి వెళ్లారు.

బూడిదెరంగు పొట్టేలు, అంతవరకూ గడ్డి మేస్తూన్నదల్లా మేత మాని, అజీజ్‌కేసి చూసింది.

తండ్రి పొట్టేలు దగ్గరకు వెళ్ళి, దానిని పట్టుకోబోయాడు. కాని అది చప్పున వెనక్కి గంతేసి తప్పించుకుని పారిపోయింది. కడమ గొర్రెలు భయపడిపోయి పక్కపక్కకి పారిపోయాయి.

పారిపోతూన్న పొట్టేలు వెంట తండ్రి పరుగెత్తి, దానిని అందుకుని, దాని వెనుకకాలు పట్టుకున్నాడు. పట్టుకుని, గుర్రం మీద ఎక్కి కూర్చున్నట్టు, దానిమీద ఎక్కి కూర్చున్నాడు. మచ్చిక చేయబడని గుర్రంమాదిరిగా, ఆ పొట్టేలు ఇటూ అటూ పరుగెత్తింది. ఈ పక్కకూ ఆ పక్కకూ ఉరికింది, ఓసారి చెంగున దౌడుతీసింది, ఓసారి కదంతొక్కింది. ఉండి వుండి మెడ కిందకి దించేసేది. అది ఎన్ని చేసినప్పటికీ తండ్రిని కిందకి తోసివేయడం దాని తరమైందికాదు — అందుకతడు ఎంతో అనుభవశాలి అయిన రౌతుకదా!

ఏది ఏమైనా అది పొట్టేలే గాని, గుర్రం కాదు. కొద్దిసేపటిలో అది అలసిపోయి, యజమాని చెప్పుచేతల్లోకి వచ్చేసి, నెమ్మదిగా అడుగులువేస్తూ నడచింది. ఇక అప్పుడు తండ్రి అజీజ్ దగ్గరకు వచ్చి, అజీజ్‌ను పొట్టేలుపైన తన వెనుకను కూర్చోబెట్టుకుని,

"ఇప్పుడు దానికి బుద్ధి నేర్పాంరా మనం. ఇక ఇప్పట్నుండి అది మనం ఎలా చెబితే అలా నడచుకుంటుంది. మనం తోలిన చోటకే వెళ్తుంది కాని, మరోచోటకి ఏమైనా సరే వెళ్లదు" అన్నాడు.

మెత్తగా వున్న పొట్టేలువీపుమీద అజీజ్ కూర్చుని, కాలి మడమలతో దాని డొక్కల్లో పొడిచి,

"ఛల్! ఛల్!" అని దానిని అదలించాడు.

గుర్రంమీద స్వారిచేయడం కంటె పొట్టేలుమీద స్వారిచేయడమే అజీజ్‌కి ఎంతో హాయి అనిపించింది. పొట్టేలుమీద అజీజ్ చాలాసేపు స్వారిచేస్తూ గొర్రెలమంద మధ్య ఇటూ అటూ తిరిగాడు. గొర్రెలు ఆశ్చర్యంతో అతడికేసి చూశాయి.

చిట్టచివరకి పొట్టేలు ఆగిపోయింది. అది త్వరత్వరగానూ భారంగానూ ఊపిరితీస్తూంది. దాని బొచ్చు చెమటతో చెమ్మగిలి వెండిలా మెరిసింది.

తండ్రి పొట్టేలుమీదనుంచి దిగిపోయి, అజీజ్‌తో అన్నాడు:

''ఇహ దాని పస అంతా లాగేశాంరా మనం! దానిమీద నువ్వింక ఒక్కడవే స్వారిచేయొచ్చు.''

ఆనాటినుండి బూడిదెరంగు పొట్టేలు అజీజ్‌కి సొంత ''గుర్రం'' అయింది – దానిమీద ఎక్కి పచ్చికబయలుకు వెళ్లేవాడు, దానిమీదే ఇంటికి వచ్చేవాడు.

వేసవి వెళ్లిపోయింది. శరత్తులో గొర్రెలన్నిటినీ మాంసోత్పత్తి ఫ్యాక్టరీకి ఒప్పగించేశారు.

ఫ్యాక్టరీకి ఒప్పజెప్పేసేప్పుడు, ఒక్కొక్క గొర్రెనీ కాటావేయడంలో అన్నిటికంటె చిట్టచివరను బూడిదెరంగు పొట్టేలును కాటావేశారు.

దానిని ఫ్యాక్టరీకి ఒప్పజెప్పేస్తూండగా, అజీజ్ తండ్రివెనుక దాగుని వలవల ఏడ్చేశాడు – దానిని పరాయివాళ్లకి ఇచ్చివేయడమంటే అజీజ్‌కి ఎంతో జాలివేసింది.

తండ్రి మేపిన గొర్రెలు లావుగా బలిసి, మంచి భేషుగ్గా కొవ్వెక్కినందుకు అక్కడున్న వారందరూ – సమష్టిక్షేత్రపు అధ్యక్షుడూ, ప్రధాన వ్యవసాయదారుడూ, ఫ్యాక్టరీ సరకుల పరీక్షాధికారీ – అతణ్ణి గొప్పగా మెచ్చుకున్నారు.

తండ్రి చిరునవ్వు నవ్వి:

''ఇందులో సగం గొప్పతనం నా అసిస్టెంటుది. ఒరే, చిట్టీ, ఇలా రారా! సిగ్గుపడకు మరి!'' అన్నాడు.

బూడిదెరంగు పొట్టేలుపై అజీజ్‌కు ఎంతో ప్రేమ అనే సంగతి సమష్టిక్షేత్రపు అధ్యక్షుడు సహజంగానే గ్రహించేశాడు. అతడు ఆ కుర్రవాడి దగ్గరకు వెళ్లి, వాడి తల నిమిరి, వాడి తండ్రిని ఉద్దేశించి

''బెకిర్‌గారూ! మీరు రేపే వెళ్లి కొత్త మందను ఏర్పాటుచేసుకోండి. మీ మందలో కొన్ని గొర్రెపిల్లల్ని అజీజ్‌కి ఒప్పజెప్పండి. వాడు అసలైన గొర్రెలకాపరి అయాడు అపుడేనూ!'' అన్నాడు.



# కొమ్ముల గొర్రెపిల్ల



మరునాడు తండ్రి కడమ గొర్రెలకాపరుల దగ్గరకు వెళ్లి, ఒక్కొక్క మందలోనుండి పదేసి గొర్రెపిల్లల్ని పోగుచేసుకుని, వాటిని తన యూర్తకి తోలుకువెళ్లాడు. తండ్రి యూర్త చేరుకున్నాక అజీజ్‌తో అన్నాడు:

"ఒరే చిట్టీ! వీటిని పెంచాల్రా మనం. వచ్చే ఏడాదికి ఇవి అప్పుడే కాస్త పెద్దవవుతాయి. మరొక్క ఏడాది, రెండేళ్లు పోతే, బాగా బలిసి కొవ్వెక్కుతాయి. వీటిలో నీ యిష్టమొచ్చిన వాటిని నువ్వు ఎంచుకుని, వాటిని నువ్వు పెంచు."

అజీజ్ సంతోషించి, గొర్రెపిల్లల దగ్గరకు పరుగెత్తి, వాటిలో కొన్నింటిని ఎంచుకుంటూ, వాటిని వేళ్లమీద లెక్కపెట్ట సాగాడు.

గొర్రెపిల్లలు ఇంకా బాగా చిన్నవేమో, అవి నెమ్మదిగానూ భయపడుతూ భయపడుతూనూ వున్నాయి. అవి అజీజ్ చుట్టూ చేరి, "మే – మే – మే" అని నీరసంగా అరవడం మొదలెట్టాయి.

వాటిమీద అజీజ్‌కి జాలిపుట్టి,

"వీటిని త్వరగా పచ్చికబయలుకి తోలుకువెళ్లాలి! మేత కావాలంటున్నాయి అవి!" అని కేకవేశాడు.

తల్లీ తండ్రీ యూర్తలోనుంచి బయటికి వచ్చి, అజీజ్‌తో కలిసి, గొర్రెపిల్లల్ని పచ్చికబయలుకి తోలుకెళ్లారు.

అన్నిటిలోనూ కాస్త బలంగా వున్న గొర్రెపిల్లలు – వసంతకాలపు తొలిరోజుల్లో పుట్టినవి – మందలో ముందు నడిచాయి. అప్పటికప్పుడే అవి వాటంతట అవే మేత మేయగల్గుతున్నాయి. వాటిని మేతకు ఎక్కడకు తోలుకెళ్తున్నదీ అవి అప్పుడే తెలుసుకున్నాయి.

కాని ఆ గొర్రెపిల్లల్లో మరీ చిన్నవి – అతి నీరసంగానూ పీలగానూ వున్నవి కూడా వున్నాయి. ఇవి పెద్ద గొర్రెపిల్లలతో సమంగా నడవ లేక, వెనక్కి వుండిపోయి, అస్తమానం అరుస్తూండేవి.

అన్నిటిలోనూ చిన్న గొర్రెపిల్లలను పదింటిని కడమవాటినుండి అజీజ్ వేరుచేసి, తండ్రితో అన్నాడు:

"వీటిని మేతకి తోలుకెళ్లకూడదు, నాన్నా! వీటిని ఇక్కడే, ఇంటిదగ్గరే మేపుతాను."

అజీజ్ తెలివితేటలకు తండ్రి మెచ్చుకుని,

"భేష్! మహా బాగా ఆలోచించి చెప్పావురా!" అన్నాడు. "కడమవాటిని అమ్మా నేనూ పచ్చికబయలుకి తోలుకుపోతాం. వీటిని నువ్వు ఒక్కడవే పెంచు. ఇవాళ ఒక్కరోజుకే కాదు – ఇవి మన దగ్గర వున్నంతకాలమూనూ సుమా! ఏం? అలానేనా?"

అజీజ్ సంతోషంతో తల వూపి,

"ఓ, అలానే! నువ్వూ నేనూ పోటీపడి పెంచుదాం, నాన్నా!" అన్నాడు.

ఆ రోజునుండి అజీజ్ ఒక్క నిమిషమైనా తన గొర్రెపిల్లలను విడిచిపెట్టేవాడుకాదు, వాటిని యూర్తకి దగ్గరగా వున్న పచ్చికబయలు మీద మేపేవాడు.

తన దగ్గర వున్న గొర్రెపిల్లలన్నిటిలోనూ ఒక గొర్రెపిల్లను అజీజ్ మరీ ముద్దుగా చూసుకునేవాడు. దాని బొచ్చు

మంచులా తెల్లగా వుండేది. అందుకని అజీజ్ దానికి "హిమానీ" అని పేరుపెట్టాడు. గొర్రెపిల్లలన్నిటిలోనూ అదే ఎంతో తెలివిగానూ ఎంతో ముద్దొస్తూనూ వుండేది. "హిమానీ, హిమానీ! ఇలా రా!" అని అజీజ్ పిలిచేసరికల్లా అది మందలోనుంచి విడిపోయి, అజీజ్ దగ్గరకు పరుగెత్తి వచ్చేది, దాని వెంట కడమ మంద అంతా వచ్చేది.

గొర్రెపిల్లలు ప్రతి రోజూ స్టెప్పీ మైదానానికి వెళ్లి పచ్చిక మేస్తూ, పెరిగి పెద్దవై బాగా కోలుకుంటున్నాయి. గొర్రె పిల్లలలో ఒకటి మాత్రం అన్నిటికంటె నీరసంగా వుంది — మెలితిరిగిన చిన్న కొమ్ములున్న బూడిదెరంగు గొర్రెపిల్ల. కడమ గొర్రెపిల్లలకి వేటికీ కొమ్ములులేవు, ఒక్క ఈ బూడిదెరంగు గొర్రెపిల్లకి మాత్రమే కొమ్ములున్నాయి. కొమ్ములుండడంచేతనే ఇదంత పీలగా వుందేమో?... — అని తలపోశాడు అజీజ్.

బూడిదెరంగు గొర్రెపిల్లను ఎలా పెంచడమో, దానికి ఎలా సంరక్షణచేయడమో తండ్రిని సలహా అడగడానికి అజీజ్ నిశ్చయించుకున్నాడు.

తండ్రి గొర్రెపిల్లను ఎత్తుకుని యూర్తలోకి తీసుకొచ్చేశాడు.

"నీరసంగా వున్న గొర్రెపిల్లల కోసమూ, జబ్బుగా వున్న గొర్రెపిల్లల కోసమూ ఈ గోనెసంచిలో గోధుమ నూకలున్నాయిరా, చిట్టీ! నీ గొర్రెపిల్లకి యీ నూకలు పెట్టు" అని చెప్పాడు తండ్రి.

అజీజ్ తన టోపీనిండా నూకలు నింపుకొని, నూకలు తీసుకొచ్చి గొర్రెపిల్లకి పెట్టాడు. కాని దానికి నూకలు తినడానికి ఇష్టంలేక, కోపంతో తల ఆడించింది.

గొర్రెపిల్ల నూకలు తినకపోవడం చూసి అజీజ్ దాని కొమ్ము గట్టిగా పట్టుకుని, ఓ పిడికెడు నూకలు దాని నోట్లో కుక్కాడు.

అది నూకలు రుచిచూసిందో లేనేలేదో, ఇక రుచి మరిగి, దానంతట ఆదే టోపీలో మూతిపెట్టి నూకలు నమలడం మొదలెట్టింది.

టోపీలో వున్న నూకలన్నిటినీ అది సాంతమూ తినే వరకూ అజీజ్ దాని దగ్గరనుంచి కదల్లేదు.

అది నూకలన్నిటినీ తిన్న తర్వాత, అజీజ్ నీటిబుగ్గదగ్గరకు వెళ్లి, టోపీని నీటిలో ముంచి, టోపీ నిండా నీళ్లు తీసుకొచ్చి, గొర్రెపిల్ల ముందుంచి, దానితో

"ఇక నీళ్లు తాగవే! నా చేతులతో పెట్టిన మేత తినడం, నా చేతులతో ఇచ్చిన నీళ్లు తాగడం నేర్చుకోవాలే నువ్వు!" అన్నాడు.

పొట్టేలుపిల్ల అజీజ్ చెప్పినట్టూ విని, మెడ దించి, టోపీలో వున్న నీళ్లు తాగింది.

"హిమానీ! హిమానీ! ఇలా రావే, మా దగ్గరకి!" అని అజీజ్ తెల్ల గొర్రెపిల్లని పిలిచాడు.

అది అజీజ్ దగ్గరకి మెల్లగా వచ్చింది.

బూడిదెరంగు గొర్రెపిల్ల పట్ల తన యజమాని మోజుపడుతూండడం చూసి తెల్ల గొర్రెపిల్ల ఓర్వలేకపోయివుండాలి. ఎండలో పచ్చికపైన పడుకుని చలికాచుకుంటూన్న బూడిదెరంగు గొర్రెపిల్లను అది అనుమానంతో వాసనచూసింది. కడమ గొర్రెపిల్లలు కూడా దానిని వాసనచూశాయి.

"ఇక్కడ్నుంచి పొండి, మీరు!" అంటూ వాటికేసి అజీజ్ చెయ్యివూపి, "నా పొట్టేలును అల్లరిపెట్టకండి! అది ఈ నిమిషమే తిండి తింది" అన్నాడు.

గొర్రెపిల్లలు అక్కడనుంచి వెళ్లిపోయి, ఆ పక్కగా పచ్చిక మేయ సాగాయి.

మరి కొద్దిరోజులకి పొట్టేలుపిల్ల పచ్చికమేయడం పూర్తిగా మానివేసింది. గోధుమ నూకలు తప్ప మరేమీ తినేదికాదు.

తన ముద్దులమూటను చూసుకుని ఎంత మురిసినా అజీజ్‌కి తనివితీరేదికాదు. దానికి పోట్లాట నేర్పుతూ రోజస్తమానం దానితోనే ఆడుకొనేవాడు.

బూడిదెరంగు పొట్టేలుపిల్ల ఎదిగి పెద్దదవుతూంది, బాగా కోలుకుంటూంది, దాని కొమ్ములు కూడా ఎదుగుతున్నాయి.

ఇలా వుండగా ఒకనాడు ఒక సంగతి జరిగింది. గొర్రెపిల్లల మందకి కాస్త దూరంగా పచ్చికబయలుపైన అజీజ్ సాగిలబడి

వుండగా, తటాలున తన వెనుక ఏదో గొడవ వినబడింది. ఏమిటా గొడవని అజీజ్ వెనక్కి తిరిగి చూసేప్పటికి, పొట్టేలుపిల్ల మరొక గొర్రెపిల్లతో పోట్లాడుతూంది.

అది కర్రి గొర్రెపిల్ల, దానికి కొమ్ములు లేవు. అది పొట్టేలు దెబ్బలకి నిలబడలేక, అక్కడనుంచి పారిపోయింది.

అది పారిపోవడం చూసి అజీజ్‌కి సంతోషం కల్గి:

"సెభాష్ పొట్టేలూ! సెభాష్! నా మంద అంతటిలోనూ నువ్వే బలమైనదానవవుతావే!" అని కేకవేశాడు.

మందలో వున్న గొర్రెపిల్లలలో మరొక గొర్రెపిల్లని అజీజ్ ఎంచి, దానిని తన పొట్టేలు ఎదుట పోట్లాటకి నిలబెట్టాడు.

తను ఏమిటి చేయాల్సివుందో పొట్టేలుపిల్ల వెంటనే పోల్చేసుకుని, గొర్రెపిల్లని ఎంత గట్టిగా ఢీకొందంటే, ఆ గొర్రెపిల్ల అల్లంత దూరాన ఎగిరి ఒక పక్కకు పడిపోయింది.

నూకల సంచి సాంతమూ ఖాళీ అయిపోతూండడం తండ్రి ఒకనాడు చూసి, కొడుకుతో

"పొట్టేలుకి ఇహ నూకలు పెట్టకు. ఇప్పటికే అది కడమ గొర్రెపిల్లలన్నిటికంటె బలంగా తయారయింది. జబ్బుగా వున్న గొర్రెపిల్లల కోసం నూకలుండాలి" అన్నాడు.

అజీజ్ చికాకుతో ముఖం చిట్లించి,

"అయితే సరేలే. నాకు నూకలు అక్కర్లేదు. నూకలు ఎక్కడ అయిపోతాయో అని నీకు భయంగా వుంటే, నా వంతు తిండి దానికి ఇచ్చేస్తాను!" అన్నాడు.

తండ్రి కొడుకువైపు నిందాపూర్వకంగా చూశాడు, కాని కుర్రవాడితో పేచీ పెట్టుకోవడం ఇష్టంలేకపోయింది.

ఆనాటినుండి పొట్టేలుకి అసలు భయమనేది లేకుండా పోయింది. తనకు ఏ గొర్రెపిల్ల కనబడినా సరే, దానిని పొడిచి కుమ్మేసేది. గొర్రెపిల్లలన్నిటితోనూ అది పోట్లాడి వాటన్నిటినీ ఓడించేసింది. ఒకనాడు అది ఏకంగా హిమానీనే అటకాయించింది.

హిమానీ పొట్టేలుతో పోట్లాడలేక, తనకు అజీజ్ సాయంచేస్తాడని నిరీక్షించుతూ అజీజ్‌కేసి చూసింది. కాని అజీజ్ పొట్టేలువీపును ముద్దుగా దువ్వడం చూసి అది వెనక్కి తిరిగిపోయి, తండ్రి కాస్తూన్న గొర్రెలమందకేసి వెళ్లిపోయింది. ఆనాటినుండి అది అజీజ్ మందలోకి కాదుకదా ఆ ఛాయలకే ఇక రావడం మానివేసింది.

చలికాలంనాటికి ఆ పొట్టేలే మందలో వున్న గొర్రెపిల్లలన్నిటిలోనూ అతిబలమైనదీ అతి ధైర్యమైనదీ అనిపించుకుంది. కుక్కలను సహితం అటకాయించేందుకు దానికి భయంలేకపోయింది.



# కొమ్ముల గొర్రెపిల్లకి కొమ్ములు పోయాయి



ఒకనాడు అజీజ్ తన పొట్టేలును వెంటబెట్టుకుని పొరుగు మంద దగ్గరకు వెళ్లాడు. అక్కడ తన నేస్తం సుల్తాన్ని కలుసుకున్నాడు.

"ఒరేయ్ సుల్తాన్! నీ దగ్గర పొట్టేలుపిల్ల వుందిరా? వుంటే చెప్పు, మరి నీ పొట్టేలుని నా పొట్టేలుతో పోట్లాడనిద్దాం" అని అజీజ్ తన ముద్దుల పొట్టేలును కొమ్ములతో పట్టుకుని డాబులు కొట్టాడు.

సుల్తాన్ ఆలోచించుతూన్నట్టుగా తల పంకించాడు. సుల్తాన్ తల వూపడం చూసి అజీజ్ "పోనీలే. నిన్ను కుమ్మమంటావా?" అన్నాడు.

"దాని చేతనవుతే ప్రయత్నించమను!" అన్నాడు సుల్తాన్.

"తర్వాత మాత్రం ఏడవకూడదు సుమా!" అంటూ అజీజ్ తన పొట్టేలును సుల్తాన్‌కు పక్కగా నిలబెట్టి "ఊఁ! ముందుకెళ్లి పొడవ్వే వాణ్ణి! వెళ్లు!" అని తన పొట్టేలును ఉసికొల్పుతూ కేకవేశాడు.

పొట్టేలు చప్పున నాలుగడుగులు వెనక్కివేసి, చెంగున సుల్తాన్ని అటకాయించింది. సుల్తాన్ మంచులో తిరగబడ్డాడు. తిరగబడి, హడలిపోయి కేకపెట్టాడు:

"ఇక చాలా బాబూ! ఒరేయ్! ఇక చాలా!"

అజీజ్ తన పొట్టేలును వెనక్కి తరిమేసి, వెటకారంగా అన్నాడు:

"ఏం, ఇప్పుడు నమ్మకం కుదిరిందిరా నీకు? ఇంకా కుదర్లేదా?"

"కుదిరిందిరా బాబూ!" అన్నాడు సుల్తాన్ లేచి, మంచు దులుపుకొంటూ. "రేపు నీ పొట్టేలును తీసుకురా. దానికి సరైన ఉజ్జీని చూస్తాను ఈ లోపున. ఇకప్పుడు నువ్వూ నేనూ తేల్చుకుందాం" అన్నాడు సుల్తాన్.

మరుచటినాడు ఉదయం, తండ్రి తన మందను మేతకి తోలుకుపోయిన తర్వాత, అజీజ్ తన పొట్టేలును వెంటబెట్టుకుని సుల్తాన్ దగ్గరకు వెళ్లాడు.

అజీజ్‌ని సుల్తాన్ కాస్సేపు వుండమని చెప్పి, అక్కడ వున్న పాకలోకి వెళ్లి, మెలికలు తిరిగి వలంపాటి కొమ్ములున్న తెల్లని పెద్ద గొర్రెపోతును వెంటబెట్టుకుని పాకలోనుంచి బయటకు వచ్చాడు.

ఆ గొర్రెపోతును చూసి, అజీజ్ తల వూపి

"నేను ఒప్పుకోన్రా! ఇది బాగా ఎదిగిన పెద్ద గొర్రెపోతు, మరి నాదేమో చిన్న పొట్టేలాయె!" అన్నాడు.

అజీజ్ దగ్గరకు సుల్తాన్ పరుగెత్తి, వాడి చేయి పట్టుకుని,

"నువ్వేమీ భయపడకురా, ఒరేయ్ అజీజ్! అది పొడవదురా. అది అప్పుడే ముసల్ది అయిపోయిందిరా!" అన్నాడు.

నిజానికి, గొర్రెపోతు వెనక్కి తగ్గిపోయింది. పోట్లాడ్డానికి దానికి ఇష్టంలేకపోయింది.

"అవును, ఇది ముసల్దే" అని తలపోశాడు అజీజ్, "నా పొట్టేలు అన్నిటినీ ఓడించేసింది. ఇహ ఈ ముసలి పోతుని ఓడించలేకపోతుందా ఏమిటి!" అనుకున్నాడు.

అజీజ్ తన పొట్టేలును కొద్దిగా వెనక్కి నిలబెట్టి,

"ఊఁ! ముందుకెళ్లి పొడవ్వే దాన్ని! వెళ్లు!" అని పొట్టేలును ఉసికొల్పుతూ కేకవేశాడు.

పొట్టేలు ఒక్క ఎగురు ఎగిరి, తెల్ల గొర్రెపోతును ఢీకొంది, ఐదారుసార్లు దాన్ని డొక్కలో పొడిచింది.

గొర్రెపోతు మొదట్లో ఏమీ లక్ష్యపెట్టలేదు. కాని తర్వాత మాత్రం దానికి కోపం వచ్చేసి, ఎర్రని మిడిగుడ్లతో పొట్టేలుకేసి కోరచూపులు చూసి, తన పెద్ద కొమ్ములను కిందకు దించి, ఆ పొట్టేలుకి ఎదురుగా నుంచుంది.

పొట్టేలు నాలుగు అడుగులు వెనక్కి వేసి, తర్వాత చెంగున గంతులేస్తూ వచ్చి గొర్రెపోతును బలంగా ఢీకొనడానికని గొర్రెపోతు మెలికల కొమ్ములమీద ఒక్క కుమ్ము కుమ్మింది.

పొట్టేలు అలా కుమ్మడంలో దాని చిన్నకొమ్ములు గొర్రెపోతు మెలికల కొమ్ముల్లో చిక్కుకున్నాయి. తన కొమ్ములు విడదీసుకుందుకు పొట్టేలు ఎంత ప్రయత్నించినప్పటికీ ఏమీ కార్యంలేకపోయింది.

దీనితో గొర్రెపోతుకి భలే కోపం వచ్చేసింది. వాటిని విడదీసేందుకు కుర్రాళ్లిద్దరూ ఎంత తంటాలుపడినప్పటికీ విడదీయలేకపోయారు. ఆ ముసలి గొర్రెపోతు తన కొమ్ములతో పొట్టేలును మీదకి ఎగరేసి, రెండు మూడు సార్లు బలంగా కుదిపింది. దభీమని పెద్ద చప్పుడైంది — పొట్టేలు ఒక పక్కకు ఎగిరి పడింది.

అజీజ్ తన పొట్టేలు దగ్గరకు పరుగెత్తి వెళ్లి, చూశాడు — పొట్టేలు నేలమీద పడివుంది, దాని వొళ్లు అంతా రక్తమయమై వుంది, కొమ్ములు ఏమైపోయాయోమరి, వాటి జాడే లేదు.

అజీజ్ భోళ్లున ఏడ్చేశాడు, తెల్ల గొర్రెపోతునూ దాని యజమానినీ నోటికొచ్చినట్లూ తిట్టాడు — ఎన్ని తిట్టితే మాత్రం ఏంకార్యం?

గాయపడిన పొట్టేలును ఇంటికి మోసుకుపోవడమే మంచిదని అజీజ్ నిశ్చయించుకుని, దానిని ఇంటికి మోసుకుపోయాడు.

అజీజ్ కంట నీరు నింపుకొని, జరిగినదంతా తండ్రితో చెప్పాడు. తండ్రి అదంతా విని,

"దీనంతటికీ తప్పు నీదేన్రా, చిట్టీ! గొర్రెపిల్లని అంత ముద్దుచేయడం తప్పు, దానికి పొడవడం నేర్పడం మరీ తప్పు. ఏమో, ఏం చెప్పగలం — అది నిన్నే పడతోసి కుమ్మేసివుండునేమో. అప్పుడు నీకు ప్రమాదకరమైన గాయాలు తగిలివుండేవి. ఏడవకు. నీ ముద్దులమూట పొట్టేలుకు కొమ్ములు వూడొచ్చేసినందుకు నువ్వు సంతోషించడమే మంచిది. దానికీ అదే మంచిది. ఇహ ఏడవకు మరి!" అన్నాడు.

తల్లి యుర్తలోనుంచి బయటికి వెళ్లి, పొట్టేలును చూసి, దానిని మరునాడు తీసుకెళ్లి మళ్లీ మందలో విడచిపెట్టేస్తానంది.

"అక్కడే అది త్వరగా కోలుకుంటుంది. ఇహ అది బతికున్నంత కాలమూ పోట్లాడలేదు" అంది తల్లి.

తండ్రి అజీజ్ దగ్గరకు వెళ్లి, వాడి భుజంమీద చేయివేసి,

"మనం పనిచేసుకునే వేళ అయిందిరా, చిట్టీ! రా, వెళ్దాం! ఈ వేళ మనం మందని కొత్త పచ్చికబయలుకి తోలుకెళ్లాలి. నీ గొర్రెపిల్లలు అంత దూరం నడవలేవేమో అని భయపడుతున్నావా ఏమిటి?" అన్నాడు.

"అబ్బే, లేదు, నాన్నా!" అన్నాడు అజీజ్, "ఆ భయంలేదు నాకు. ఇహ ఇప్పట్నుండి వాటి గురించి శ్రద్ధతీసుకుని జాగ్రత్తగా పెంచుతాను."



## చిన్నారి తెలుగు పాఠకులకు!

ఈ పుస్తకాన్ని చిట్టి పాఠకులకోసం ప్రఖ్యాత సోవియట్ రచయిత షుకూర్‌బేక్ బెయ్‌షెనాలీయెవ్ రచించాడు. ఆయన కిర్గీజ్ రిపబ్లిక్‌లో నివసిస్తున్నాడు. తన కిర్గీజ్ రిపబ్లిక్ గురించి, తన మాతృభాషలో అనేక నవలలూ కథలూ పెద్దవాళ్లకోసమూ చిన్నవాళ్లకోసమూ రచించాడు.

ఈ కథ మీకు నచ్చిందా?

ఈ పుస్తకం గురించి మీ అభిప్రాయాన్ని మీరు కాని, మీ తల్లితండ్రులు కాని మాకు తెలియచేసిన యెడల మేం చాలా సంతోషిస్తాం.

"ప్రగతి" ప్రచురణాలయం

మా చిరునామా:

*Progress Publishers*
*17, Zubovsky Boulevard*
*Moscow, USSR*

అనువాదం: వుప్పల లక్ష్మణరావు
రెండవ ముద్రణ

**Ш. Бейшеналиев**
РОГАТЫЙ ЯГНЕНОК
*На языке телугу*



"ప్రగతి" ప్రచురణాలయం
మాస్కో

సోవియట్ యూనియన్‌లో ముద్రింపబడింది

Б $\frac{70802\text{-}325}{014(01)\text{-}80}$ 705-80

4803010102

